(జగదీశ్వరుండైన శివునియందుఁగాని జగత్తుల కంతరాత్మయైన విష్ణునందుఁగాని వస్తుత్వము విషయమై భేదబుద్ధి నాకెంతమాత్రమును లేదు. ఐనప్పటికి. నాకు భజనానురాగము చంద్రావతంసుఁడగు శివునియందే యున్నది.)

లీలాశుకుండు శైవసంప్రదాయములోని వాఁడైనను విష్ణుభక్తుఁడై శ్రీకృష్ణకర్ణామృత మను గ్రంథమందు—

శ్లో॥ "శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీ జపపరా నితరాం తథాపి
చేతో మదీయమతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరం॥"

(పంచాక్షరీమంత్ర జపమందాసక్తులమైన మేము శివసంబంధులము. ఆవిషయమందు సంశయమున కవసరములేదు. ఐనప్పటికి నామనంబు నల్లని యవిసెపువ్వుయొక్క కాంతి వంటి కాంతి గలవాఁడును నగుమొగము గలవాఁడును గోపస్త్రీ పుత్రుఁడునగు శ్రీకృష్ణునే యెంతయు స్మరించుచున్నది.)

ఇష్టదేవతాభక్త్యతిశయముం దెల్పు కథ లనేకములు కలవు.